# ఒబాదియా సాహసాలు

బ్రింటన్ టర్కిల్







నిద్ర పోటానికి ముందు నాన్న
చదువుతుంటే వినటం స్టార్‌బక్
కుటుంబానికి అలవాటు. నాన్న బైబిల్‌ని
మోకాళ్ల మీద పెట్టుకుని మొదలుపెట్టాడు:
"గొర్రెపిల్లతో కలిసి తోడేలు..."

"ఈ రోజు ఒక పెద్ద తోడేలు నన్ను
తిన్నంత పని చేసింది," అన్నాడు
ఒబాదియా.



“ఎక్కడ?” కళ్లు పెద్దవి చేసుకుంటూ అడిగింది రాచెల్.

“ఈస్టన్ వాళ్ల గుర్రపుశాలలోని గుర్రాలను ఆ తోడేలు తినేసి నా వెంట పడింది. కానీ నేను ఒక చెట్టు ఎక్కేశాను...” చెప్పాడు ఒబాదియా.

రెబెక్కా, మోసెస్, ఆసా పగలబడి నవ్వసాగారు.

“చెల్లెలిని భయపెట్టినందుకు సిగ్గుపడాలి, ఒబాదియా!” అమ్మ అంది. “నా ఒళ్లో కూర్చో, రాచెల్. మన ప్రాంతంలో తోడేళ్లు లేవు. ఒబాదియావి కట్టు కథలు.”

“అది అబద్ధం, ఒబాదియా. నీ నాలుకని అదుపులో ఉంచుకో. నేను ఈసయ్య నుంచి చదువుతున్నాను...” నాన్న అన్నాడు.

బడిలో టీచర్ ఎలిజా గార్డెనర్ పలక మీద L అక్షరం రాశారు. “లాబ్‌స్టర్, లైట్ హౌస్, లేడీ. L తో ఇంకేమి పదాలు మొదలవుతాయి?”

“లిటిల్,” అంది అబిగేల్ మాసి.

“లయన్,” అన్నాడు థామస్ స్వేన్.

“నిన్న చెస్ట్‌నట్ వీధిలో ఒక పెద్ద సింహాన్ని పట్టుకున్నాను,” ఒబాదియా అన్నాడు.



“ఏం చేశావూ?” కళ్లజోడు పైనుంచి చూస్తూ టీచర్ అడిగారు.

“అది నన్ను చూసి గర్జించింది. కానీ నేను దానిని కట్ట మీదగా లాగి సముద్రంలోకి తోశాను,” చెప్పాడు ఒబాదియా.

తరగతిలో పిల్లలందరూ నవ్వారు.

“నువ్వు అటువంటి పని ఏమీ చెయ్యలేదు, ఒబాదియా స్టార్‌బక్,” ఎలిజా గార్డెనర్ టీచర్ అన్నారు. “అది ఉత్తి కట్టు కథ. నేను మీ అమ్మకు ఉత్తరం రాసి పంపిస్తాను. ఏది నిజమో, ఏది కాదో ఆమె నీకు నేర్పిస్తుందని అనుకుంటున్నాను!”





టీచర్ ఉత్తరం చూసి అమ్మ బాధ పడింది. "ఒబాదియా కట్టు కథలతో ఏం చెయ్యాలి?" ఆమె అంది. "ఇలాంటిది మళ్లీ నీ నోట విన్నానంటే నిన్ను వదిలిపెట్టి మేమంతా గొర్రెల బొచ్చు కత్తిరించే చోటుకి వెళతాం. నిజం చెప్పటం నువ్వు నేర్చుకోవాలి. నాన్న బల్ల దగ్గరకి వెళ్లి, 'నిజం చెప్పటంలో దేవుడు నాకు సహాయపడుగాక' అని పదిసార్లు రాయి. బహుశా అప్పుడన్నా నీకు అది గుర్తుంటుందేమో."

ఎలా రాయాలో అమ్మ చూపిస్తే చాలా కష్టపడి రాశాడు ఒబాదియా.

ఒబాదియా మళ్లీ అబద్ధాలు చెప్పకపోవటంతో అందరితోపాటు అతను కూడా గొర్రెల బొచ్చు కత్తిరించే చోటుకి బయలు దేరాడు.



తిను బండారాలు సర్దటంలో అమ్మకి రెబెక్కా, రాచెల్ సహాయపడ్డారు. ముసలి గుర్రం తులిప్‌ని బండికి కట్టి, సామానులు సర్దటంలో నాన్నకి మోసెస్, ఆసా, ఒబాదియాలు సహాయపడ్డారు.

"జాతర దగ్గర కలుద్దాం!" గుర్రపు బండిలో వెళుతున్న లెవి బంకర్ అరిచాడు. అతను ముందుకు వెళ్లిపోతుంటే నాన్న నవ్వుతూ చెయ్యి ఊపాడు.

ఒబాదియా ఆశ్చర్యపోయాడు. "మనం జాతరకి కూడా వెళుతున్నామా?" అంతకు ముందు ఎప్పుడూ అక్కడికి తీసుకెళ్లని నాన్నని అడిగాడు.

"జాతరలు మనబోటి సాదాసీదా జీవులకు కాదు," నాన్న అన్నాడు. "బంకర్ ఉత్తినే అలా అన్నాడు."

లెవి బంకర్ నిజమే చెప్పేలా దేవుడు సహాయపడాలని ఒబాదియా అనుకున్నాడు.



సంవత్సరం పొడవునా గొర్రెలు వాళ్ల ప్రాంతంలో మేస్తూ తిరుగుతాయి. వసంతం వచ్చిన తరవాత వాటిని శుభ్రంగా కడిగి, బొచ్చు కత్తిరిస్తారు. ఆ సందర్భంగా స్నేహితులు, పక్కింటివాళ్లు, నావికులు, వాళ్ల ప్రియురాళ్లు, పట్టణం నుంచి అపరిచితులు కూడా వస్తారు. ఆ రోజు అంతా సరదాగా గడుపుతారు. పిల్లలే కాదు పెద్దవాళ్లు కూడా దీని కోసం ఎదురు చూసేవాళ్లు. అక్కడ నోరూరించే తినుబండారాలు, రకరకాల వస్తువులు ఎన్నో ఉంటాయి.

ఆ దారిలో అన్నింటికంటే ముసలి తులిప్ మెల్లగా వెళుతోందనటంలో సందేహం లేదు.



ఎక్కడ ఆగాలో అమ్మ నిర్ణయించింది. ముసలి తులిప్‌ని ఊడదీసి కట్టేశారు. సామానులు దించి, గుడారం వేశారు. మంట రాజేశారు. అప్పుడు, బొచ్చు కత్తిరించటాన్ని పిల్లలు చూడటానికి నాన్న తీసుకుని వెళ్లాడు. వాళ్లు జాతర పక్కకి వెళ్లలేదు, కానీ గొర్రెల కొట్టాల తరవాత జాతర జెండాలను ఒబాదియా చూశాడు.

బొచ్చు కత్తిరించే గుడారంలోని మనుషులు అరుస్తున్నారు, నవ్వుతున్నా . భయపడిన గొర్రెలు అరుస్తూ ఉంటే వాటిని ముందుకు తోస్తున్నారు. ఉన్ని బంతిలా ఉన్న గొర్రెను గొరిగి బొచ్చు లేకుండా వింతగా చెయ్యటానికి నిమిషం కంటే ఎక్కువ పట్టటం లేదు.





అమ్మ తెచ్చినవి, వండినవి అందరూ పొట్ట నిండా తిన్నారు. అందరిలోకి ఒబాదియా చాలా ఎక్కువ తిన్నాడనుకోండి.

పాత్రలన్నీ సర్దేసిన తరవాత తెలిసిన వాళ్ల దగ్గర నుంచి కావలసిన బొమ్మలు, తిను బండారాలు కొనుక్కోటానికి పిల్లలకి నాన్న డబ్బులు ఇచ్చాడు. తరవాత తెలిసిన వాళ్లని కలవటానికి అమ్మా, నాన్నా వెళ్లారు.

చైనా నుంచి వచ్చిందని డోర్కాస్ అత్త చెప్పిన ఎర్ర పెట్టె కొనటానికి రెబెక్కా తన డబ్బులన్నీ ఖర్చు చేసేసింది.





మోసెస్ చాలా పదునైన కత్తి కొన్నాడు.



పెద్దగా శబ్దం చేస్తున్న తిమింగలం ఎముకతో చేసిన ఈలను ఆసా కొన్నాడు.

మారియా వదిన నుంచి వెస్ట్ ఇండీస్ అల్లం మురబ్బాని రాచెల్ కొంది. ఏం కొనాలో తెలియక ఒబాదియా గొర్రెల కొట్టాల వైపు వెళ్లాడు.





ఇంటికి వెళ్లే సమయానికి ఒబాదియా కనపడక పోవటంతో, “అబ్బాయిలందరినీ కలిసే ఉండమన్నాను కదా,” అంటూ మోసెస్, ఆసాలను అమ్మ కోప్పడింది.

“అబ్బాయిలూ, బొచ్చు గొరిగే గుడారాల దగ్గర మళ్లీ ఒకసారి అతని కోసం వెదకండి,” నాన్న అన్నా . “నేను జాతర వైపుకి వెళ్లి చూస్తాను.”

అదే సమయానికి ఒబాదియా అక్కడికి వచ్చాడు.

“ఇప్పటిదాకా ఎక్కడ మాయమైపోయావు!” అమ్మ ఆశ్చర్యపోయింది. “నీ బట్టలు అంత మురికిగా అయ్యాయేమిటి? నీ టోపీ ఏమయ్యింది?”

ఒబాదియా చెప్పటం మొదలుపెట్టాడు, “మోసెస్, ఆసా నుంచి తప్పిపోయాను. దాంతో గొర్రెల కొట్టాల దగ్గరకు వెళ్లి ఒక గొర్రెను తట్టాను...



...ఆ గొర్రె దగ్గర ఉన్న మనిషి దాని మీదకి ఎక్కుతావా అని అడిగాడు, నేను సరే అన్నాను. నన్ను గొర్రె మీద కూర్చోపెట్టాడు, దాని కొమ్ములను గట్టిగా పట్టుకున్నాను, అప్పుడు ఆ గొర్రె కంచె మీద నుంచి ఒక్క దూకు దూకింది, కొమ్ములు వదిలిపెట్టమని ఆ మనిషి అరిచాడు కానీ భయంవేసి నేను వదిలి పెట్టలేదు, నా టోపీ గాలికి ఎగిరిపోయింది, అందరూ గొర్రె దారికి అడ్డం తప్పుకున్నారు, అది జెండాలు ఉన్న గుడారాల వైపు పరిగెత్తింది...





...గొర్రె నన్ను గాలి లోకి విసిరేసింది, నేను ఎగిరి వెళ్లి ఒక గుడారంలో పడ్డాను, అక్కడ ఎరుపు, తెలుపు చారల గౌను వేసుకున్న ఒక పంది ఉంది, అలాంటివే బట్టలు వేసుకున్న ఒక వ్యక్తి ఏదో గారడి చెయ్యబోతున్నాడు, అంతలో పంది భయపడింది, నేను కూడా భయపడిపోయాను, ఆ వ్యక్తి నన్ను అక్కడినుంచి పొమ్మన్నాడు, నేను పరిగెత్తుతూ ఒక పెద్ద గుడారంలోకి వెళ్లాను...

...అక్కడ అందరూ డాన్స్ చేస్తున్నారు.
ఒక అందమైన మహిళ డాన్స్ చేస్తా
అని నన్ను అడిగింది, నాకు రాదంటే
ఎలా చెయ్యాలో చూపించింది, ఆమె
ప్రియుడైన నావికుడు ఈ పిల్లవాడికి
జాతర అంతా చూపిద్దాం అన్నాడు...








...ఈకలతో అలంకరించుకుని ఉన్న వ్యక్తి నిప్పుని తింటున్న గుడారంలోకి తీసుకునివెళ్లారు, నిప్పుని తింటున్నా అతనికి ఏమీ కాలేదు...

...తరవాత అందంగా అలంకరించుకున్న ఒక మహిళ దగ్గరకు తీసుకుని వెళ్లారు, ఆమె పెద్ద పెద్ద చెవి రింగులు పెట్టుకుని ఉంది, మనం తీసిన కార్డులను బట్టి ఆమె మన భవిష్యత్తు చెప్పగలదు, ఆ అందమైన మహిళ, నావికుడు పెళ్లి చేసుకుంటారని చెప్పింది, ఆ వ్యక్తి లాగా నేను కూడా నావికుడిని అవుతానని చెప్పింది, ఆమెకు ధన్యవాదాలు చెప్పి నేను ఇక్కడికి వచ్చేశాను."



అందరూ అలా చూస్తుండిపోయారు.

“నా టోపీ అలా పోయింది,” ఒబాదియా చెప్పాడు.

“నువ్వు ఎక్కిన తోడేలు ఎంత పెద్దగా ఉంది, ఒబాదియా?” మోసెస్ అడిగాడు.

“జలకన్య తోపాటు తిమింగలాన్ని ఎక్కాడు,” అన్నాడు ఆసా.

“నేను గొర్రెను ఎక్కాను!” అన్నాడు ఒబాదియా.

“ఒబాదియా...” నాన్న కోపంగా అన్నాడు.

అమ్మ ఒంగి అతని బట్టలకున్న దుమ్మును దులిపేసింది.

“అది నిజం, అమ్మా! నిజంగా అలా జరిగింది... నిఝంగా.”

అతని మాటలను ఎవరూ నమ్మలేదు.









“ఏమైతేనేం, ఒబాదియాకి దెబ్బలు ఏమీ తగల లేదు!” తన గుర్రపు బండిలో వెళుతున్న లెవి బంకర్ అన్నాడు. “మొత్తానికి భలే సవారీ చేశాడులే!”

“ఏమిటీ?” అన్నాడు నాన్న.

“గొర్రె మీద సవారీ. దాని గురించి మీకు చెప్పలేదా? పంది ఉన్న గుడారాంలోకి విసిరేసేవరకు దానికి బంక లాగా అతుక్కొనిపోయాడు. అతని వెనకే పరిగెత్తాను కానీ అతను మాయమైపోయాడు. నిప్పు తినే వ్యక్తి గుడారంలో చూశాను, అక్కడా లేదు. డాన్స్ గుడారంలో ఉండడని అక్కడికి వెళ్ల లేదు. నీ టోపీ ఇదిగో, ఒబాదియా. ఊళ్లో కలుద్దాం.”

ఒబాదియాని అమ్మ చేతుల్లోకి తీసుకుని ముద్దు పెట్టుకుంది. “నువ్వు చెప్పింది నిజమే! అయ్యో! నీకు దెబ్బలు తగల లేదు కదా?”

ముసలి తులిప్ మెల్లగా ఇంటివైపుకి వెళుతోంది. ఇప్పటివరకు ఇంత బాగా ఏనాడూ జరగలేదని అందరూ అన్నారు. ప్రతి ఒక్కరి దగ్గరా చూపించటానికి ఏదో ఒకటి ఉంది, చెప్పటానికి ఏదో ఒకటి ఉంది. అయితే ఒబాదియా ఒక్కడే నిజమైన సాహసం చేశాడు. తన దగ్గర ఉన్న ఆఖరి అల్లం మురబ్బా ముక్కని రాచెల్ అతనికి ఇచ్చింది. “అదంతా మళ్లీ చెప్పవా?” అని ఆమె బతిమాలింది. మొదటినుంచి ఒబాదియా అంతా చెప్పుకొచ్చాడు, జరిగింది జరిగినట్టు.



అయిపోయింది